# సంగీత

# శశాంకవిజయము.

# పండితాభిప్రాయములు.

బ్రహ్మశ్రీ శనగల గోపాల కృష్ణకవి గారిచే రచియింపంబడిన "సంగీత శశాంక విజయము" అను నాటకమును నేను సాంగముగా దిలకించితిని; ఇందలికథా సంవిధానకము పాత్రౌచిత్యము రసపోషణము వర్ణనాతీతము కవిత్వమ్ము శిరీషకుసుమ పేశలము వీరిసహజ పాండిత్యము సహజకవిత్వముచే హృద్యముగా నున్నదనుటకు సందియము లేదు. పండితులైనను ప్రాయవలవిగానిరీతిని వీరినాటకమును రచించిరి. ఇట్టి వీరిపరిశ్రమను భగవంతుఁడు సార్థకముఁ జేయుగాక:

ఇట్లు

ఉభయ భాషాప్రవీణ

గూడ-సత్యనారాయణ శాస్త్రి

తెలుఁగు పండితులు.

పెదనందిపాడు

బోర్డు హైస్కూలు

ది 2-2-39.

# ఈనాటకమునందు వచ్చుపాత్రలు

పురుషులు —

అత్రి మహాముని.

చంద్రుడు.

బృహస్పతి.

ఇంద్రుడు.

నైఋతి.

నారదుడు.

శుక్రుడు.

ఋషపర్వుడు.

శంకరుడు.

బ్రహ్మ.

స్త్రీలు —

తార.

అనసూయ.

కీర్వాణి.

రా.—సందర్భాను సారముగ భటులు మొదలగువారు వచ్చుదురు

# ఒక్క మాట.

పాఠక మహాశయులారా !

మన యాంధ్రదేశమునం దనేక నాటకంబులు రచియించిన మహామహు లెందరెందరో గలరు. ప్రదర్శించువా రనేకులు గలరు. కాని ప్రేక్షకుల కమితానందమును ప్రదర్శకుల కనుకూలమును గలిగించునదియె సులభశైలిగా నుండవలెను. నామిత్రులు కొందరు శృంగారవీర కరుణారసప్రధానమగు ఈ నాటకమును రచియింపుమని కోరిన వారి యాశయమును త్రోసిపుచ్చలేకనే ఈ నిరూపకము రచియించితి. నా కెక్కువ భాషయందు ప్రావీణ్యత లేకపోయినను నామిత్రుల ప్రోత్సాహమువలననే నీపని గావింప సాహసించితిని. ఇందు లోపము లున్నను ఇది నా ప్రథమప్రయత్న మగుటచేత పండితులు, ప్రేక్షకులు. నన్నుమన్నించి మఱింత ప్రోత్సహించగలందులకు వేడుకొనుచున్నాను.

ఈ గ్రంథమునుధన వ్యయప్రయాసలకోర్చి ముద్రింపించిన మహారాజశ్రీ రంగా వెంకటరత్నంగారికి నేనెంతయుం గృతజ్ఞుఁడను. ఇట్టి మహోపకార మొనరించిన సద్గుణున కాయురారోగ్యభోగభాగ్యంబు లొసంగి కాపాడవలయునని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాఁడను.

పెదనందిపాడు,
2-2-39.

ఇట్లు రచయిత,
శనగల గోపాలకృష్ణకవి.

# సంగీతశశాంకవిజయము.

(ప్రథమాంకము)

## 1వ రంగము.

(అత్రి—అనసూయ—ప్రవేశము)

అనసూయ—నాథా! ఎంతతపంబొనర్చిన వ్రతంబు లెన్నియొనర్చిన, దానంబులెన్నిగావించిననేమి ఫలము, సంతతి, గలుగదాయె.

తే॥ గీ॥ సంతతినిగల్గు వారలు ♦ సద్గతులకు
బోవుదురటంచు దెల్పగా ♦ బుధులవలన
విన్నవారము భోగంబు ♦ లెన్నియున్న
నిష్ఫలముగాచె మనజన్మ ♦ నిక్కముగను.

అత్రి—ఔనౌను! పరమేష్టికి మనపై దయలేదాయె. ఏమిచేయగలము.

అన—దయ లేదననేల మనమావిధాత్రుని ప్రార్థించినవానికి మనపై కృప గల్గకపోవునా?

అత్రి—అటులైన గంగోత్రిగోత్రంబునకరిగి తపంబు గావించెదము వెళ్లుదము.

(నిష్క్రమింతురు.)

## 2-వ రంగము.

(అత్రి—అనసూయలు—గంగోత్రిగోత్రముమీాద ప్రవేశము.)

అత్రి—మనోహారి! తపఃసమాధియుండుండుట కీ శైలరాజ మనుకూలమైనది.

అన—మనోహరా! ఈ పర్వతారణ్యములను గాంచినతోడ నే నాడె దమానందసాగరోన్మగ్న మగుచున్నయది.

అత్రి—మనలకానందము గలుగుట యబ్బురముగాదు. నిర్జరులంత వారలకే స్వాంతంబున కమితానందంబుఁ జేకూర్చును.

అన — ఎందువలన?

అత్రి—అటు వీక్షింపుము.

సీ॥ కన్నులపండువై ♦ గాన్పించునట్టియీ
కమలాకరంబులఁల ♦ గాంచుము బల
నింబజంబీరక ♦ ।రంబ రంభాదుల
యాన్నత్యమునుగాంచు ♦ మతివనీవు
శుకపికంబులరొదల్ ♦ శ్రోత్రంబులకు విందు
గొల్పుచుండెడుగాంచు ♦ కువలయాక్షి
దట్టమౌపొదలందు ♦ దట్టించివిసుమికెడు
హరిణంబులనుగాంచు ♦ హరిణనేత్రి

తే॥ గీ। ఇట్టిశృంగార వనభూమి ♦ మెట్టినంత
అమరులకె సౌఖ్యమొంతయో ♦ నావహిల్లు
మనకు సంతోష మొనగూర్చు ♦ టనగనెంత
సుఖనివాసంబు మనకిది ♦ సుదతిమిగుల.

ఈ శృంగారవనంబునందు గన్పడు నున్నతంబగు శైలరాజంబును గనుగొంటివా.

తే॥ గీ॥ అంబరమునకు శైలాగ్రి ♦ మంటియుండె
అందు ప్రవహించు సెలయేర్లయందు గల్గు
ధ్వనులనాలించి ♦ మేఘాలధ్వనులటంచు
చేరి కేకులు నృత్యముల్ ♦ జేయుచుండె!

మహోన్నతంబై సౌఖ్యసమృద్ధంబై యొప్పు ఈగంగోత్రినోత్రి

బున విధాతృనిగూర్చి కడునిష్టజూని తపంబొనర్చెదము.

అన—అటులనే గావించెదము.

అత్రి, అనసూయలు—(చేతులు ముకుళించి)శతానందా! పితామహా మామనస్సంకల్పం బీడేర్పుము.

తే॥గీ॥ జగతిగన్పడు స్థావర ♦ జంగమాదు
లెల్లమీసృష్టిగాదె మీ ♦ యుల్లమునను
కరుణదలచి కోర్కెవాంఛిత ♦ వరములిమ్ము
ప్రస్తుతింతుము పరమేష్టి! ♦ సుస్థిరముగ.

అత్రి—వాణీమనోహరా! మావాంఛితార్థము లొసంగ నీవేకర్తవు.

తే॥గీ॥ పుత్రవంతులకే స్వర్గ ♦ భోగములును
గతులు గల్గును; సంతతి ♦ గలుగదేని
వారిజన్మం బసార్థకం ♦ బౌను మాకు
సంతతి యొసంగు మనములు ♦ సంతసింప.

మహానుభావా సృష్టికర్తా! మాప్రార్థన లాలకించి అభిమతంబు లొసగరాదా. మాపైకృపలేదా? మాంపాహి మాంపాహి

(బ్రహ్మ ప్రత్యక్షమగును.)

అత్రి—మహానుభావా! పరమేష్టీ! మీదర్శన ప్రాప్తివలన కడుంగడు ధన్యులమైతిమి.

అన—దేవాతిదేవా! చతురాననా! తమ సంపూర్ణకృపాకటాక్షవీక్షణంబున మాజన్మలు ధన్యత్వంబునొందె.

బ్రహ్మ—మీమనోభీష్టం బిద్యదియో దెల్పుఁడు.

అత్రి—అయ్యా! పుత్రపుత్రికా సంతానరహితులము-ఇహాపరములకు వెలియైతిమి.

అన—మేము సంతానరహితులమగుటచే సత్సంతానంబుగల్గు నట్లను గ్రహింపుడు.

బ్రహ్మ—మునిదంపతులారా! సద్గుణ శౌర్య విరాజితుండగు నొక్కసుపుత్రుండు నాయంశంబున మీగర్భంబున నుదయించుగాక.

(బ్రహ్మ అంతర్ధానంబు నొందును.)

అత్రి—సఖి! మనయాశ్రమంబున కేగుదము రా.

[నిష్క్రమింతురు.]

(3-వ రంగము)

(అత్రి, అనసూయ, చంద్రుడు—ప్రవేశము)

అత్రి—సఖీ! మనముద్దులపుత్రుడగు చంద్రుని జదివించిన సద్బుద్ధిశాలియగు. విద్యలేకున్న జ్ఞానశూన్యుండగు నెచ్చటి కంపింతుము.

అన—ప్రాణేశ్వరా! మరొకచోటి కంపించనేల విడచి మనమొట్టు లుండుము. సకలవిద్యాపారంగతులగు తమరు విద్యచెప్పరాదా

అత్రి—నేజెప్పుటకేమిగాని యొక్కసందేహము—

తే॥ గీ॥ భయమువినయంబులుండవు ♦ భక్తిసున్న
యగును లక్ష్యమునుండదు ♦ తెగువజేసి

శిక్ష సేతుమటన్నను ♦ చేతులాడ
వబల పుత్రునిపై కూర్మి ♦ యధికమగుట.

అన—అట్లయిన నెచ్చటికి బంపించెదరు?

అత్రి—తే॥ గీ॥ సర్వవిద్యావిశారద ♦ సద్గుణుండు
మనల జూచినగారము ♦ మదినిగాంచు
సురగురునియొద్దకిప్పుడు ♦ సుతునిబంప
సర్వవిద్యల నాతండు ♦ జదివివచ్చు.

అన—మంచిది! మంచిది! బాలకులులేరుగాన వారు మనపుత్రునిపై యాదరముంచెదరు.

అత్రి—(చంద్రునివైపున కభిముఖుండై) కుమారా! నీసద్బుద్ధికి దగిన గురుని బడసి చదువుగరచుట యుక్తంబు.

తే॥ గీ॥ పరిమళంబానగూడిన ♦ పసిడిభాతి
చిత్తరువు ప్రాణవాయువుల్ ♦ జెందురీతి
విద్యగాంచినపురుషుండు ♦ వెలయుకీర్తి
విద్యలేకున్నచో పశు ♦ వేనిజంబు.

చం॥ సురగురుపాలికేగి మది సు ♦ స్థిరతఁ బహుశాస్త్రవిద్యలఁ
సరగునసేర్చి గీష్పతిని సత్కృతులన్ ♦ దనియింపజేసియుఁ
చిరతరకీర్తి పెంపొదవి శీఘ్రగతిన్ ♦ జనుదెమ్ము పిమ్మటఁ
ధరను యశంబుగాంతువికతద్గుణము ♦ సమ్మతినొంది పుత్రకా.

అన—ప్రియపుత్రా! సురగురుకరుణవడసి యాతని యాజ్ఞకు విూరక్ల సకల వేదశాస్త్రార్థకోవిదుండవై సౌఖ్యమునరమ్ము.

చంద్రు—జననీజనకులారా! సెలవా సంగుడు పోయివచ్చెద. (అని నమస్కరించును.)

(అందరు నిష్క్రమింతురు)



# సంగీతశశాంకవిజయము.

## ద్వితీయాంకము.

### 1-వ రంగము

[బృహస్పతి, చంద్రుడు—ప్రవేశము]

చంద్రు— ఆచార్యా! వందనము (పాదములపై బడును)

బృహ— చిరాయుష్మంతుడవుగమ్ము బాలకా! నీవీలీల చాలగా దూలి నాకడ కేతెంచితివి. నీ తలిదండ్రులపే రెయ్యది. కులగోత్రంబు లెవ్వియో। నీనామం బేమందురో దెల్పుము.

చంద్రు— ఆచార్యా!

క॥ జనకుం డత్రిమహాముని
జననియు ననసూయయనుచు ♦ జనులందురు నా
జననీ జనకులు మీకడ
ఘనశాస్త్రచయంబు జదువ ♦ గా బంపిరనన్.

నానామంబు చంద్రుడందురు.

బృహ—(స్వగతము) ఆహా! ఎప్పుడు నిచ్చటికి విచ్చేయని యత్రి. మహార్షి సుపుత్రుండు వచ్చుట సుదినందు శుభంబు (ప్రకా - శముగా) అబ్బాయీ!

క॥ మీతల్లికి క్షేమమెకద
మీదండ్రికి సేమమానె ♦ మీభాతృలుసం

ప్రీతిసుఖస్థితినుండిరె

చేతోమోదమున తపము ♦ చెలగుచునున్నే.

చంద్ర—సురగురువరా! అందరును సేమమె నన్ను భవత్కుమారుని గా భావించి, వేదశాస్త్ర కోవిదుగావించి, ముజ్జగంబుల మీాయశస్సు ప్రసరింపఁజేయుడు.

బృహ—మంచిది—

తే॥ గీ॥ అత్రి కనసూయ గర్భమం ♦ దవతరింప
నీదుమృదు వాక్యముల్ విన ♦ మోదమలరె
నీవు మచ్ఛిష్యుడవైన ♦ నిక్కముగను
చదువు గరపెదనీకెవ్వ ♦ రెదురనంగ

కం॥ సదమల మతివౌనిన్నీ
పదునాలుగు విద్యలందు ♦ ప్రౌఢుని జేతుఁ
విదితంబుగ ముజ్జగముల
బదులెవ్వరు లేరటంచు ♦ బల్కించెదగా.

అత్రికుమారా! మన గృహంబునకు బోవుదముర—

(స్థలము—అంతఃపురము)

(2 వ రంగము)

(తార, బృహస్పతి, చంద్రుడు—ప్రవేశము.)

బృహ—(తారనుజూచి) ప్రియసఖీ! ఈతండెవ్వరో తెలియునా.

తార—ప్రాణేశ్వరా! ఎవ్వరైనది తెలియదు.

బృహ— తే॥గీ॥ అత్రి యనసూయలకు కూర్మి ♦ పుత్రుడితడు
సకల సద్విజులెల్లను ♦ జదువు కొసగ
తల్లి దండ్రుల యాజ్ఞని ♦ త్తరిని వచ్చె
పంకజాయత నేత్ర ఈ ♦ బాలకుండు.

ఉ॥ కోమలదేహమునుకుసుమ ♦ కోమలియీతని చిత్తవృత్తినీ
వేమరునున్ గ్రహించితగు ♦ వేళకు భోజన మజ్జనాదులక్
ప్రేమవహించి జూడమన ♦ పేరులునిమ్మహివన్నె కెక్కెదో
సామజ యాననాదరము ♦ చంద్రునిపై కడునుండజూడుమా.

తార— నాథా! నీకన్నను నాకుగల ప్రేమ ఎక్కుడు—

బృహ— కారణంబేమి

తార— దీర్ఘకాలంబునుండియు సుపుత్ర పుత్రికారత్నంబులు లేని కారణంబున.

బృహ— ఔనౌను. [చంద్రునివైపునకు దిరిగి] బాలకా! పాఠశాలకు పోవ్రదమురా.

[అందరు నిష్క్రమింతురు.]

[స్థలము—పాఠశాల]

3 వ రంగము.

[బృహస్పతి, చంద్రుడు—ప్రవేశము]

బృహా—(స్వగతము) ఆహా! ఎంద రెందరికో విద్యగరపితిని. ఈశశ
కుని బుద్ధికౌశలత్వ మెవ్వరి యందును గానను.
[ప్రకాశముగా] బాలకా! సర్వసద్విద్యలభ్యసించితివి.

ఉ॥ సంతసమందునామదిశ ♦ శాంక! త్వదీయఘనంబుగాంచినన
పంతముఋాని యాపరమ ♦ పావనుడుగ్రుడు సంగరాన నా
వంతయు గెల్వబోమనన ♦ వాంఛ ఫలించె విరించి కూరిమి
కంతునిధిక్కరించి ప్రతి ♦ కాంతిచలింతువునమ్ముమిమ్మగ

బాలకా! ధనుర్వేద మర్మశాస్త్రముల లక్షణ లక్ష్యాంశ
కూడ నేర్చి ప్రవీణుండ వైతివి.

చంద్రు—ఇది యంతయు భవత్కృపయోగదా.

(భటుడు—ప్రవేశము)

భటు—సురగురువరా! వందనము.

బృహా—దీర్ఘాయుర్భవభటా! నిర్నిమిత్తంబుగా వచ్చువాడవు కావు.
ణం బెద్దిరో తెల్పు.

భటు—సురాచార్యా!

ఆ॥ వె॥ పాకశాసనుండు ♦ పరమ సంప్రీతితో
కరితువు సల్పమనసు ♦ గల్గినదట
మిమ్ము దోడితేగ ♦ మీాసముఖమ్మున
కనిపినాడు దేవ ♦ చనగ వలయు.

దేవరవారలు సురగురులౌటంజేసి మీారచ్చుట లేనిది కార్యంబుజరుగనేరదు. గాన సునాశీరుండ ధ్వరంబు సేయ సనుకట్టి మిమ్ములదోట్కొని రమ్మన వచ్చితి.

బృహ—కాలోచిత కృత్యంబులు నెరశేర్చుకోని వెనువెంటనే వచ్చెద పొమ్ము.

భటు—స్వామీ! పోయి వచ్చెద.

[నిష్క్రమించును.]

బృహ—[చంద్రునితో] శిష్యా! ఈవృత్తాంతము మీాఅమ్మగారితో జెప్పుదమురా.

[నిష్క్రమింతురు]

[స్థలము—అంతఃపురము]

**4 వ రంగము**

[తార—ప్రవేశము]

తార—[తనలో] ఎన్నిదినంబులనుండి వేచియున్నను సరసిజాక్షునిగూడుటకు సమయంబు దొరకదయ్యె. వాని ముఖలావణ్యములు గాంచినంతనే నాకు వానిపై మిక్కుటంబగు ప్రేమ జనించె.

బిడౌజు డిదివర కెన్ని యో మఖంబులాచరించువా డిప్పుడేమియు నెరవేర్పుచున్నట్లు గన్పట్టదు. పాకశాసనుండ ధ్వరంబు గావించినచో సురగురుం డింటనుండక వచ్చుటకరుగు నప్పుడు చంద్రుం డింటియుం దొంటరిగానుండును. గాన నా యభీష్టంబప్పు డీడేర్చుకొందు. అంతదనుకనే నీవిరహతాప మనుభవింపవలసిన దే. (పరిక్రమించి) అదుగో! నానాథు డిప్పుడిటకే వచ్చుచున్నట్టున్నది.

[బృహస్పతి, చంద్రుడు—ప్రవేశము]

బృహ—[తారనుగాంచి] మనోహరీ! ఈవార్త వింటివా?

తార—ఏమిటియావార్త చెల్పుడు.

బృహ—ఏమీలేదు. వియోగదుఃఖసాగరం బెట్లుగడతునో

సీ॥ సురలోకనాథుండు ♦ సుస్థిరహృదయుడై
ఇష్ట కామ్యార్థంబు ♦ లిచ్చుకొఱకు
ఘనన మొక్కటిసల్ప ♦ సమకట్టినాడట
గురువునౌనన్ను దో ♦ డ్కొనుచు వేగ
రమ్మటంచును బంపె ♦ రాజభటుడువచ్చె
వచ్చెదనని చెప్పి ♦ బుచ్చితతని
త్రిభువనంబులకెల్ల ♦ ప్రభువరుండాతని
శాసనంబును జుల్క ♦ సేయతగదు

తే॥ గీ॥ గాన నేనేగి వేగంబు ♦ గానె వత్తు
డెందమున ఖేదమొందకు ♦ మందగమన
యింటిపనులెల్ల నెరవేర్పు ♦ చుంటివేని
ధనముగొనివత్తు మనమున ♦ వనటదక్కు.

కాంతా! వంతనావంతయైనబొందకు. పతివ్రతాలక్షణం బెరింగి
యే యుందువు. మైవను గొంతజెప్పెద.

తే॥ గీ॥ ఇంటనాథుండు లేకున్న ♦ యొంటినుండి
కురులునున్నంగనువ్వంగ ♦ గూడదతివ
వన్నెచిన్నెల వలువలు ♦ వ డలగదు
తిలక మెల్లప్పుడొక్కరీతి ♦ దిద్దవలయు.

ార—జీవితేశ్వరా! నేనెరుంగని నీతు లెవ్వియులేవు. [కపటదుః
ఖముతో]

తే॥ గీ॥ జీవితేశ్వర! తెల్పెద ♦ చిత్తగింపు
నిన్ను బాసియు నేనొక్క ♦ నిముసమైన
నుండనోపుదే యీయింట ♦ నుండు టెట్లు
వెంటవచ్చెద గైకొని ♦ వేగమునను.

ౖహ—కురంగనేత్రీ! నిన్నొంటరిగా నీయింటనుంచి పోనేల? కంట
కంబగు నుమ్మలికంబున బొగులనేల. నాజంటబాయని ప్రియ
వ్యుండగు యీశశాంకునింట నునిచిపోయెద వంతమాను.

తే॥ గీ॥ పల్లవాధరి గృహకృత్య ♦ భారమెల్ల
బాలుడయ్యును నెరవేర్ప ♦ జాలునిలేఁను
నన్నుగాంచినరీతికి ♦ మిన్ననితని
సాకుచుండుము పితరులు ♦ సంతసింప.

తార — (తనలో) ఆహా! నేటికిగదా నాకోర్కె ఫలించె చంద్రునింట నునచి నానాథుండ ధ్వరంబునకేగు. గాన నేనప్పుడు చంద్రుని గూడి నామనోరథం బీడేర్చుకొనెద. అయినను పైకి నాతని ప్రియాణము నాకు దుఃఖదాయకముగా నుండునట్లు నటించెద గాక. (ప్రకాశముగా) మనోహరా! కాననాంతరంబుల బహు దినంబులు కడుతపంబులొనర్చి, కష్టంబులకోర్చి యిరువుర మొ క్కచోట సుఖంబుగా నిప్పుడుండ నాపాపపుదైవంబు మన కిరువుర కెడబాపదలచి యీామిషగల్పించెగాబోలు.

తే॥ గీ॥ తిరిగితిమిగాదె కొన్నాళ్లు ♦ తీర్థములకు
సల్పితిమిగాదె కొన్నాళ్లు ♦ సవనదీక్ష
లోర్చితిమిగాదె కొన్నినా ♦ ళ్లొకట ప్రొద్దు
బడలితిమిగాదె కొన్నాళ్ళు ♦ బహుతపముల.

కం॥ కడునిడుములకును బాల్పడి
బడలితి మదిగాదె ప్రాణ ♦ పదమని మీావెం
బడి ద్రిమ్మరుచుంటినిగద
విడనాడగఁ జేసెదైవ♦విధికే మందుఁ.

ఒక్కనాడైనను మీచెలిమి కలిమి సలిపియున్నదానను కాను జపతపస్వాధ్యాయములతోనే కాలముగడచెను.

తే॥ గీ॥ కటకటా నేను మిముబాయ ♦ గల్గితిగద
దైవవిధి బాయనేరికి ♦ తరముగాదు
పాకశాసను కోర్కెయే ♦ పగిదినైన
చక్క పరచంగ వేగంబె చనుడిమీరు.

నేనెంత వంతలన్బొగలినను స్వర్గాధి నాధుని శాసనంబతిక్ర మించ బాడిగాదు. అధ్వరంబునకంతరాయంబు వాటిల్లు గాన నేగుడు.

ప్రహ—ఈశశాంకుడు నాకు పరమ పిృయుడు. కాన వీనిని గూర్చి నీకింతగా చెప్పవలసివచ్చె. ఇంక నీవితని నెట్లుసాకెదవో.

నార—ఈ యతిృకుమారుని నీకుమారునిగా భావింపుమని జెప్పితిరి. గాననేనుకూడానాకుమారునిగానే తలంచి పోషించెద—

ప్రహ—తడవైన బాగుండదు వెళ్ళివచ్చువాడ.

(అందరు నిష్క్రమింతురు.)



# సంగీతశశాంకవిజయము

## తృతీయాంకము.

(తార—ప్రవేశము)

### 1 వ రంగము.

తార—(తనలో) ఔరౌరా! ఆశబోవ తీర్థం బెదురువచ్చినట్ల

నావాంఛ ఫలించె నాస్వాంతమున ధైర్యంబునకేగె.

తే॥ గీ॥ ఒంటరిగఁజిక్కె చంద్రుండు ♦ నింటియొద్ద
మక్కువలుమీరి మదనుని ♦ మదముడంచ
సమయమెప్పుడు దొరకునో ♦ స్వాంతమునను
వంతనొందంగ నేటికి ♦ వలనుపడియె.

తార—[తనలో] చంద్రుండు గురువయ్యని కొంతదవ్వుల కనుపబో
ఇంకను రాడయ్యె. ఇంటిలో సరసాన్న పాక శాకంబులుసమక
ర్చితి. [ప్రక్కకుదిరిగి] అదిగో! చంద్రుండిక్కడకే వచ
చున్నాడు.

[చంద్రుండు—ప్రవేశము]

తార—శశాంకా! ఆచార్యులవారి నంపించివచ్చితివా.

తే॥ గీ॥ అయ్యవారలు నెంతద ♦ వ్వరిగినారు
వదలిపోలేక సంసార ♦ వాంఛవదలి
యేగినారలు నన్నిటు ♦ నేలుకొనెదొ
చిక్కితివి నీదుకరమున ♦ చిలుకవలెను.

ప్రొద్దతిక్రమించుచున్నది. నేను నరుసదినంబుగాన,

కం॥ శిరమజ్జనమొనరించెద
నిరువురము యథేచ్ఛనుండ ♦ నిది సమయముహాహా
సరసుడ యనుమానించకు
సరగునరారమ్ము మనము ♦ సంతసపడగన్.

చంద్రు—హరిహరీ! ఎంతపాపము మీరిట్లు నాతో బల్కతగదు. మీ రిట్టి కఠినోక్తులుబల్కిన నేను వినజాలను. ఇంటనుండువాడను ను, వెళ్ళువాడను. [అని లేచిపోవును.]

[ఇరువురు నిష్క్రమింతురు.]

స్థలము—ఉద్యానవనము.

[చంద్రుడు—ప్రవేశము.]

2-వ రంగము.

చంద్రు—[తనలో] ఔరౌరా! ఈవనవైభవం బేమని బొగడుదును

తే॥ గీ॥ నింబజంబీరచూతక ♦ దంబవకు ళీ
నాగచంపక కేతకీ ♦ నారికేళ
పనసనారంగ ఖర్జూర ♦ బదరికప్రముఖ
భూజముల సొబగింతని ♦ బొగడవశమె.

అల్లిబిల్లిగానల్లిన మల్లెలతలును. వాని సుమంబుల పరిమళంబు లును, చల్లని మారుతంబు వీచుటయు, శుకపికంబు లరనంబు లును మనంబున కింపొనరజేయుచున్నయవి. అని వనవిహారము జేయదొడంగె.

[తార—ప్రవేశము]

తార—[నలుదిక్కులు పరికించి] పేరపెన్నిధి గాంచురీతినే దలచిన కార్యము నేటికి నిర్వాహకంబయ్యె. కొంతసేపు నేనీ పొద మాటున డాగి నేనితని చర్యలు గనుగొనియెదగాక.

[పొదమాటున డాగును.]

చంద్రు—ఎవ్వరా చెట్టుమాటున డాగినచిన్నది.

సీ॥ కాంతసౌందర్యంబు ♦ గాంచినతోడ్తోడ
డెందంబు విభ్రాంతి ♦ జెందెనహాహ
కన్నులపండువై ♦ గ్రాలెడునెమ్మోము
కాంతులు గ్రిమ్మెది ♦ శాంతములకు
రాజీవవదనదా ♦ రంగారుబంగారు
మేనుసౌభాగ్యంబు ♦ మించునడచు
మంజులవాణిదా ♦ మధ్యంబునభముతో
కదసి హారోరాహారి ♦ గానుబోరు

తే॥ గీ॥ తరుణిగానంబు పు ♦ ల్కండ్ర మరపుజేయు
చూపులెల్లను వటకోటి ♦ జొక్కసేయు
రమణిసోయగమెన్నంగ ♦ బ్రహ్మకైన
చిలువరేనికినైనను వర్ణింప ♦ నలవియగునె.

[తనలో] నేనింతదవ్వులనుండి దాని యొయ్యారము, సౌం
ర్యము బాగడుచున్న నేమిఫలము. దూరంబుననుండు పర్వ

బులు, ననుపుగా గన్పట్టును గావున సమీపించి సవిస్తారం బెల్లను గనుగొనియెదగాక.

తే॥ గీ॥ తరుణి నీపురమెయ్యది ♦ తల్లిదండ్రు
లెవరు నీనాథుపేరెద్ది ♦ ఎందుకిచట
నొంటరిగ నుంటివౌషతి ♦ జంటబాసి
వౌకారణంబేమి దెల్పుమో ♦ వారిజాక్షి.

చంద్రు— [తనలో] నేను సమీపించినకొలది కనుపింపక పొదల మాటునకుబోయి డాగుచున్నది. సిగ్గుజనించెఁగాబోలు. (ప్రకాశముగా) ఓసుందరీ! నీయుందంబు నాడెందంబున కానందంబుగావించె నొక్కసారిగన్పడి నాకన్నుల పండువు సేయుము

తార —(తనలో) చంద్రుడు నారూపలావణ్యంబును లెరింగియు నెరుంగని వానివలె మోహమగ్నత జెందియున్నవాడు. కాముకుల మనంబులనేక విధంబులుగా మారుచుండును. ఇన్నిటికి నాపైభ్రాంతి గల్గియున్నట్లుగన్పట్టెడి (ప్రకాశముగా) ఓరిచంద్రా!

తే॥ గీ॥ ఇంతలో మరచితివి యెంతో ♦ వింతగాదె
లీల సంతోషవార్థిని ♦ నోలలాడు
సమయమిది గానవచ్చితి ♦ కమలవైరి
జాగుసేయకురతి దేల్పు ♦ వేగరమ్ము.

చంద్రు— ఓహోహో! ఎంతవెఱ్ఱివాడ నేనెంత మూఢుండను. ఈమె యిచ్చటికి వచ్చునని ఇన్ని శృంగార చేష్టలుగావించుచునని

మెరుఁగనైతిని. పొదరిండ్ల మాటునడాగి కనుపడని కతంబున నెవ్వరోయని భ్రమించితిని.

హా! పరమేశ్వరా! మత్తుడ! క్రూరచిత్తుడను. మన్మథా! గురుపత్నిపై మరులు గొల్పనేల. మానసమా! గురుభామిని తల్లియని దెలియదా. (ప్రకాశముగా) తల్లీ! తారాదేవి! మీరా? ఎంతపాపంబున కొడిగట్టితిని.

తార—ఏటు విటులకుటిల చిత్తంబున మాటలాడుట సహజంబుగా బోలు.

చంద్ర.—కం॥ నాకడ నీవిటులుండఁగ
లోకులు సందేహపడరె లోకేశుణ! యీా

తార— లోకులగని భయపడక, నన్
జేకొనివాంఛితము దీర్పు శీఘ్రములోనన్,

సీ॥ చిన్ననాటను నుండి ♦ చెలిమి స్నేహైగోరి
యున్నదాననుగదా ♦ యోర్పుగల్గి
యున్నందుకీవేళ ♦ కన్నులకింపుగా
నిర్జర మొకచోట ♦ నుండగల్గె
నుండగల్గుటగదా ♦ నింపువేడుకతోడ
సరస సల్లాపముల్ ♦ సలుపగల్గె
ఇంటనుండెడు పను ♦ లింపుతో నారవేర్చి
వచ్చితి నీయందు ♦ నిచ్చగల్గి

గీ॥ దాహ నేటికి మదిలోన ♦ తలపు గల్గి
బయలుపరతును నాకోర్కి ♦ భయమదేం
కంతుకేళికి నాతోడ ♦ గలసిమెలసి
వాంఛితముదీర్పు వేరొక ♦ వాంఛగలదే.

ంద్రు —[స్వగతము] ఔరౌరా! ఎంతమోసము. ఇంతటిపని కవలం బించునటంచెరుగనైతిని. పణతులతో చెలిమిసేయుట. ఫణుల చెలిమికెనయునగు. [ప్రకాశముగా] అమ్మా! నన్నివిట్లనతగదు. నీవు గృహకృత్యంబులొనర్చుచు నింట నుండవలయునేగాని పరులయెడ శృంగారచేష్టలు చూపతగదు. మగవాలి కిట్టి తలంపులు గలుగకూడదు. సత్కులంబున కపకీర్తి సంభవించును. కాన నీగృహమునకీ వేగుము.

—ఔరా! చంద్రా! కర్ణకఠోరంబగు వాక్యములు వాకొచ్చెద వేమిరా.

తే గీ॥ కుసుమశరుబాధలకు జిక్కి ♦ విసువుజెంది.
వలచివచ్చిన కాంతను ♦ వలదటంచు
బలుకువానికిని మాపరం ♦ బులు హుళక్కి
వానిజన్మంబు వృధగాదె ♦ వంజవైరి.

దు—తల్లీ! నన్నివిట్లనతగదు. నేనంతవాడనుగాను. సత్కులంబున పుట్టినదానవునీవు. సత్కులజాతుండనునేను మన సత్కులంబులకుహాని దేవలదు. ఈకోర్కి మానుము.

తార — శశాంకా ! ఎన్నిమాటలు సేప్పియుంటివిరా.

ఆ॥ వె॥ పిన్ననాటనుండి ♦ పెంచితి నేటికి
పెద్దవాడవయ్యు ♦ పెడమతంబు
బలుకువాడవంచు ♦ దెలియనైతినిగద
కూర్మిగల్గియేలు ♦ కొనుము వినుము.

తే॥ గీ॥ చతురమతివయ్యు సద్గుణ ♦ శాలివయ్యు
ధరబరోపకారార్థ మి ♦ దంశరీర
మనుచుబల్కుదు బుధులవా ♦ క్యములు మరచి
విరహిణీమారణమొనర్ప ♦ వెడలినావె.
ఆత్మహత్యవలన మహాపాతకంబు నిన్ను జెందుసుమా!

చంద్రు—[తనలో] ఈకాంత కంతుబారికిజిక్కి సంతాపించుచు ఎం
జెప్పినను వినునట్లు గాన్పింపదు. కాంత స్వాంతంబు కాం
మరలించెదగాక. [ప్రకాశముగా] గురుపత్నీ !

తే॥ గీ॥ గురుసతీవిన్నను నీవిట్లు ♦ గోరతగదు
పురుషునకు తల్లులేవురు ♦ పుడమియందు
గలరటంచును కోవిదుల్ ♦ బలుకు తేరగ
చానవినలేదె నాతోడ ♦ సరస మేల.

మరియు పతివ్రతలైనవారలకు.

చ॥ కతికదుకోపియై వనతి భామలు ♦ పెట్టెదుపాడు నైననున్
మరిచెడివృద్ధుడైన బహుమానముతోడ ♦ కురూపియైననున్

సతి మితిలేనిభక్తిఁ గొని సత్కృతులఁ ♦ దనియింపజేసినఁ
అతియశము మీఁధరిత్రిపరమంబును బొందును♦ మోక్షమార్గము.

ఇంట నాథుండు లేనియెడ తుంటవిల్కానిబారికి జిక్కి కంటకంబులగు మాటలాడుట కిచ్చటి కేతెంచితివా. చాలు—చాలు-వెంటనే ఇంటికేగుము, జంటబాయనిపతుల నతిక్రమించి మెలగుట సతులకు సమంజసముగాదు.

౨ర—చంద్రా! ఏమిటికి? ఏమనియెదవు.

॥ మగని నతిక్రమించితని మాటికిమాటికి ♦ బల్కెదీవు నె
ల్లగును మగండటన్నమన మందున నేరి ♦ వరించునో యతం
డగును ప్రియుండు వేరొకనియందున ♦ డెందముబోవదయ్యె నీ
దగు సువిలాసముల్ గనినదానను ♦ గావున నిన్ను గోరితిఁ.

తే॥ గీ॥ వావివరుసలు వెతుకంగ ♦ వలనుపడునె
ఎచ్చటచ్చటివరుసలు ♦ నచ్చటచటె
కాని వేరొకచోటుల ♦ గలయబోవు
కాన మీవారిచర్యలే ♦ కరువుపెడుదు.

చంద్రా! నీవేదో గొప్పగా చెప్పుకొనెదవు మీవారిగుణగణంబు లెవ్వరెరుంగరు—

సీ॥ గురుపత్ని యాసించు ♦ పురుహూతుడెరుగడే
గౌతము గృహిణితో ♦ గలయుటెల్ల

తనపట్టియుని భార ♦ తి నిదలంచియునా పె
గలయుట విసమెయా ♦ కమల భవుకు
రాధమేనత్తని ♦ మాధవుడెరుగడే
కంతుపోరున నెట్లు ♦ కలసి మెలసె
అన్నయిల్లాలంచు ♦ నను మానపడక నీ
గురుకు నిర్భయమున ♦ గూడలేదె

తే॥గీ॥ చాలుచాలును మీవారి ♦ చర్యలిట్లు
జరుగుచుండగనవి మూల ♦ మరుగు వెట్టి
నక్కవినయంబు లిటుబల్క ♦ న్యాయమగునె
వారికన్న ఘనుండవె ♦ వారిజారి.

అటువంటి మహామహులకన్న నీవెక్కుడు యశంబార్జించు వాడవ.

తే॥ గీ॥ అపయశస్సున కాటప ♦ ట్టైనగాక
సాటిబంధులు వినినింద ♦ సలుపుగాక
తొలులు తగదంచు నాతోడ ♦ జెప్పుగాక
విడువనీపయి భ్రాంతిని ♦ వేయునేల

చంద్రు— (తనలో) అయ్యో! ఈకాంత నేనెంతనీతి బోధించినను వంతంబిసు మంతయైనను వీడదు- పాపపుదైవమా! పలుబామువం బెట్టదలంచితివా నేనేమి సేయుదు.

చ॥ గురుచరణారవిందములు గొల్చిమనంబున మోదమందుచున్
నిరుపమ వేదశాస్త్రములు నేర్చి ప్రవీణుడ నౌదునంచు స
త్వరమున వచ్చినేర్చితిని వాసముకేగెద పట్లదిట్టతన్
సురగురు డింటలేసితరి జూచినన్ గవయంగగోరెగా.

హా! పరమేశ్వరా! నాకేతెరువు గాన్పింపదయ్యె. డెందమా! ఈయిందుముఖిపై కాంక్షజనియింపజేయకుము (ప్రకాశముగా) అమ్మా! నీవిట్లు గోరతగదు.

తార — ఔరా నిశాపతీ! మనంబున నెంతగానో యోచించి తొలుతటి సుద్దులే బల్కదలంచితివా. నేనమ్మనౌదునా నీకు? చాలు-చాలు—

ఉ॥ అమ్మయటంచు బల్కెదవు యాయనసూయయెగాక నన్నిలో
కొమ్మడితల్లిలౌదురెయ హా వెడసీతులు గుప్పెదారలో
సమ్మతమొంది తంచుముఖ సారస వైఖరిగానుపించెశ్రీ
ఘుమ్మున కమ్మవిల్తునిదుర్గమ్మునరింపు కరమ్మునేప్పునన్.
శశాంకా! మరుమాటవలదు. ఇంటికి వెళ్ళుదము.

[అని కౌగలించ బోవును.]

చంద్రు—అమ్మా! నన్నంటరాకుము. మహాపాతకము.
తార—అమ్మా అనకుము. అమ్మి అనుము. ఏమి చంద్రా! నీపై భ్రాంతిచే ప్రాణములుగ్గపట్టియెంత బ్రతిమాలుకున్నను కనికర మింసుమంతయైనను గలుగక పోయెనుగదా ఏమిసేయుదును.

చంద్రు— అమ్మా! ఏమిసేయనక్కరలేదు. నాకుబుద్ధులు జెప్పమని దను.

తార— ఏమి? నన్నుపహాస్యము జేసెదవా. నీకు బుద్ధులు జెప్పెదానను నేనా? చెప్పెదను—మీగురువర్యులింటికేతెంచిన తోడనే నీపై లేనిపోని కొండెంబులెన్నియో జెప్పి నిన్ను శిక్షింప జేయకుందునా. అటుపిమ్మట ఆలోచించుకొనెదవుగాక. వెళ్లుదానను.

[తార నిష్క్రమించును.]

చంద్రు— [తనలో] అబ్బా! ఇప్పటికేదోవిధముగా తప్పించుకొని యీగండము గడపితిని. ఏమి తప్పించుకొన్నట్లు తార తనభర్త యగు బృహస్పతులవారు ఇంటికి వచ్చినతోడనే "స్త్రీబుద్ధిః ప్రళయాంతకమ్" అనునట్లు యేమిచెప్పునో యేమిశిక్ష సేయించునో తెలియదయ్యె. ఇచ్చటనుండి యామె వెళ్ళి కొంతతడవయ్యె. నేను వెళ్ళులోపల గురువులవారు వచ్చియేయుందురు, కాకున్న నామెకోర్కి దీర్పకతప్పదు.
ఎట్లాగైన నే నధోగతిపాలగుట నిజము వెళ్ళువాడను.

[నిష్క్రమించును]

( య జ్ఞ శా ల )
3-వ రంగము.

ఇంద్రుడు, బృహస్పతి— ప్రవేశము.

బృ— పురందరా! నీ వాచరించిన మఖంబు నిర్విఘ్నంబుగా కొన సాగె

ఆ॥ వె॥ కాంచవలయునంచు ♦ కడుకౌతుకంబున
వచ్చినట్టి భూమి ♦ వరులు మునులు
తమరు పారితోషి ♦ కములియ్యదృప్తులై
చనిరి వారివారి ♦ సదనములకు.

భవదీయాచార్యుల నగుట యందరు వెళ్ళినను దినత్రయంబు లిచ్చటనుండి కొన్ని సద్బుద్ధులు గరపితి. సెలవొసంగిన నేనేగుదు.

ఇంద్రు—నాప్రయత్నం బేమియులేదు. భవదీయ కృపావిశేషంబున నిమ్మఖంబు నెరవేరె. ఈ మందారకుసుమమాలిక ధరింపుడు. ఈ సుభూషణంబులు గైకొనుడు. (అని కంఠంబునకు వైచును.)

బృహ—గురువులపై శిష్యుల కిటువంటి వాత్సల్య ముండుట శ్రేయస్కరమగు నాపై కూర్మియుంచుడు. నేనేగివచ్చెద.

ఇంద్రు—గురువరా! చిరకాలంబును నాపై మీరా శీర్వాద ముంచుడు.

(అందరు నిష్క్రమింతురు.)

బృహస్పతి, తార, చంద్రుడు—ప్రవేశము.

4-వ రంగము.

తార—మనోహరా! వందనము.

బృహ—దీర్ఘసుమంగళీభవ.

చంద్రు—గురువర్యా నమస్కారము.

బృహ—చిరాయుష్మంతుడవుగాతి (తారవైపుకుచూచి) మనోహారీ! మహేంద్రుం డొసంగిన కనకమణి, మయూరాదిభూషణంబులును దివ్యాంబరములును గైకొనుము.

తార—ప్రాణేశ్వరా! అమరేంద్రు డాచరించిన యధ్వరంబునకే యాంతరాయంబు వాటిల్లక సాంతంబుగా నెరవేరినదికదా.

బృహ—బుద్ధిమంతు లాచరించు పనులకే యంతరాయంబు వాటిల్లదు. నిర్విఘ్నంబుగా కొనసాగె. ఇంట ని న్నొంటరిగావిడచి మఖంబున కేగినది మొదలు నీపై ధ్యాసమరలించిన మరలదయ్యె నచ్చుటకు వీలులేని కారణంబే వెరుంగుదువుగదా—

తార—అధ్వరాంతమువరకు తమ రచ్చటనే యుండవలయునుగదా. వచ్చుటకెట్లు వలనుపడును. ఎప్పుడిచ్చటికి వత్తురాయని మీ రాకకై వేచియున్నదాన.

బృహ—శిష్యా! అత్రికుమారా.

తే॥ గీ॥ వెనుకపాఠంబులను వల్లె ♦ వేసినావె
భూరిశాస్త్రార్థముల గడి ♦ దీరినావె
అమ్మచెప్పిన పనులయం ♦ దలరినావె
వెలగి మాకీర్తి భువిపైన ♦ నిలపినావె.

చంద్రు—(చిరునవ్వునగి) అప్పుడప్పుడు పఠింపుచుంటి నాచార్యా—

బృహ—(స్వగతము) వీర లొకరిముఖంబులొకరు చూచుకొనుచు పిన్నన వ్వొల్కుచు ఈతండు సమాధానంబొసంగె. విపరీతం

ఎద్దియో జరిగియుండు కొంతతడవు పరికించెద. (ప్రకాశముగా) నిత్యకృత్యంబుల కీవేళ కాల మతిక్రమించుచున్నది. పోయి వచ్చెద. (అని నిష్క్రమించును.)

తార — ప్రియుడా! నేటితో మనకోర్కెలు విఫలీకృతంబు లాయెను గద.

చంద్రు — ఎందువలన.

తార —

మ॥ ముదిపారుండు గృహంబు జేరె మనసం • మోదంబులిం కెట్టులన్
తుదినెగ్గుంగలవయ్యె నెయ్యమునకున్ • దూరంబుగా జేసె నీ
ర్దయాత్ముండు మగండు దైవమునకే • యన్యాయమున్ జేసితో
గద నిన్నింతటిపీడగల్గె పటుదుః • ఖాంబోధి నెట్లీదుదున్.

మనచర్యలు ఆచార్యులవారు గన్పట్టిరిసుమా?

చంద్రు — ఇంటనుండువరకు జంటబాయు టెందులకు? ఎప్పటియట్ల సుఖంబున నుందుదము.

(నిష్క్రమింతురు)

బృహస్పతి — తార — ప్రవేశము.

5-వ రంగము.

బృహ — ఓసిపాపి !

ఉ॥ పాపపుకృత్యముసలుప • పాల్పడితివి దురాత్మురాల! నా
శాపపు బారికిన్ నిలువ • జాలవు నిన్నిపుడేమి జేసినన్

పాపము లేదు సాధ్వివని ♦ భావమునందు తలంతు సత్యముఁ
డాపగ నేల జెప్పు కదు ♦ దైన్యతనొందిన లాభమున్నదే.

కిరిందుమిా దెఱుంగక గావించిన చైవులకు డెంకంబున గుందె
దవా చాలుచాలు.

చం॥ నినుగవయంగ నాతడతి ♦ నిర్భయవృత్తిగ డెంగి కోరెనో
కనులకు గావరంబెనయ ♦ గాదమి నాతని నీవుగోరితో!
చెనటియదార్థముఁ దెలుపు ♦ చేసిన చైవ్యలదాప నేలనీ
కునువన జారికిన్ దగిన ♦ క్రూరతరంబగు శిక్షసేయుదుఁ.

తార—మనోహరా! నిర్నిమిత్తంబుగా కలుషంబున కాస్పదంబైతిమ
న్నింపవలయు—

బృహ—ఎంత తప్పులొనర్చినను మన్నింపవలయునా.

ఉ॥ ఓసి దురాత్మురాలయిపు ♦ షోపికతో డులవంత నొందినఁ
జేసిన దోసముల్ గుడుప ♦ జేయక నూరక పోవుసుమ్ము పెః
గాసిల జేయునీముఖము ♦ గాంచిన పాపకలాపమిత్తరిఁ
బాసటమైతగు త్వెడగు ♦ పల్కులు బల్కకు చాలుచాలికఁ!

తార—(కిరిందుచూచుచు) నేనే, కడుకూరిర కృత్యంబులొనర్చిన
దాననా—

సీ॥ ఓమహాసీయనే ♦ నేమని దెల్పుదు
తామెఱుఁగని ధర్మ ♦ మేమిగలదు

నిజము బల్కిన నమ్మ ♦ నేరరు నేనేమి
సేయుదు దుష్కీర్తి ♦ వాయతరమె
పెక్కుతప్పులొనర్చి ♦ పెంపెక్కియుండరే
గౌతమప్రియసతీ ♦ కాంతలెల్ల
వారికన్నను ♦ మిన్నకూరికృత్యంబులు
మేరమీరి యొనర్చ ♦ నేరనైతి

తే॥ గీ॥ తప్పొనర్పని వారలీ ♦ ధరణిగలరె
తెలిసి తెలియక నొనరించు ♦ కలుషములను
పతులు సైపగవలెగాని ♦ పట్టు బట్టి
కోపగించిన దక్కునే ♦ కాపురంబు.

తార—కన్నీరునింపుచు కాళ్ళపైబడి) జీవితేశ్వరా! మీరునాపై) కోపగించుట పిచ్చుకపై బ్రహ్మాస్త్రంబు ప్రయోగించు నట్లగు. శాంతభావమూనుడు.

బృహ—కాంతా! లెమ్ము. ఇంటిపనుల నెరవేర్చ బొమ్ము.

తార—తమయాజ్ఞను సారంబున వెళ్ళుదానను.

[తార నిష్క్రమించును.]

బృహ—[స్వగతము] కోపావేశంబున శాపం బొసంగితినేని భస్మీభూతులు గాకమానరు. అంతదూరము పోనేల మంచిమాటలచేత నే మందలించి చంద్రుని మరలించెద. [దిక్కులుపరికించి] చంద్రుడిక్కడికే వచ్చుచున్నట్లున్నది.

[చంద్రుడు—ప్రవేశము]

6 వ రంగము

బృహ—[చంద్రునింగాంచి] శిష్యా!

ఉ॥ బాలక! నీవు నాకడను ♦ భక్తిమెయిన్ పలుశాస్త్రవిద్యలున్
చాలగ నేర్చినాడవుమది ♦ సంతస వారధిదేల్చినావు నిన్
బోలగ నెవ్వరో పరిల ♦ పూజ్యుడ వౌదువు విక్రమంబునన్
మేలొనగూడు నీకెపుడు ♦ మేలిమి శిష్యుని బొందబోనికన్.

నీతల్లిదండ్రులెంతటి దుఃఖంబున బొగలుచుండిరో, నీవు గనుపింపకయున్నచో జగమెల్లగన్పడనియట్లయుని దలంతురు. గాన శీఘ్రంబు నీనగరంబునకీ వేగుటనుచితంబు.

చంద్రు—గురువరా! ఆలాగే వెళ్ళివచ్చువాడను—

మ॥ చిరకాలంబుననుండి మీపదములన్ ♦ సేవించి సద్భక్తితో
కరమొప్పన్ సకలార్థ తత్వములు మీ♦కారుణ్యశన్ నేర్చితిన్
గురులౌ మీదగు నాజ్ఞబొందుటకు నా ♦ కోర్కెల్ ఫలింపంగను
స్థిర బుద్ధిన్ కడు మీదరంబొసగి యా♦శీర్వాదమున్ జేయుమా.

బృహ—చిరాయుష్మంతుండవై సౌఖ్యంబున నుండుము పొమ్ము.

చంద్రి—[స్వగతము] పొమ్మను వాక్యమేగాని రమ్మనుమాట సెలవియ్యరైరి ఇమ్మానసంబున కెయ్యదియో సందియంబు బొడమె. [ప్రకాశముగా] గురువరా! వెళ్ళివచ్చెదను.

[నిష్క్రమింతురు.]

[తార — కీర్వాణి — ప్రవేశము]

7 వ రంగము.

తార — నెచ్చెలి చిరకాలంబునుండియు చంద్రునియందు నాకుగల ఎక్కువ మక్కువలు నీవెరింగినవేగదా యాపాపపు దైవంబు మాయిరువ్వురకెడబాపి జేసెనెట్లోర్చియుందు. సత్వరంబున నీవతం డెచ్చోట నుండునో యచ్చటికేగి నాడెందమానందంబు సేయుము.

కీర — అమ్మా! ఆచంద్రునితో నేమి చెప్పమనెదవు.

తార — ప్రియసఖీ! నామాటలుగా నిట్లనుము.

సీ॥ నిను బాసినది మొదల్ ‡ నిదురకంటికిరాదు
ఆహారమరుచియై ‡ నట్టులుండు
పానీయములపైని ‡ భ్రాంతిగల్గునుగాని
త్రావంగవిషతుల్య ‡ తనువహించు
విలసన్మణీహార ‡ ములిపైని కూర్మియు
ధరియింప భారమా ‡ వరశుభాంగ!
పూలసెజ్జనుబాడ ‡ బుద్ధిపుట్టునుగాని
విరులగాంచిన ముండ్ల ‡ విధముదోచు
తే॥ గీ॥ కారణంబేమియని నాదు ‡ కాంతుడడుగ
చిగురుబోడిని వీడిసీ ‡ వగుపడమికి

వెతల బొఁగలుచు మానస । వివశయగుచు
ననిశమును నీదుధ్యానంబు । నందుసోలు

తే॥ గీ॥ పనులు గావించు వేళనీ । పైనికూర్మి
గలుగుటన్ జేసి పనులెల్ల । వలదటంచు
మాను పరులతో మాటాడ । మనసు గల్గి
మాటలాడుచునుండి నీ । మాటదలచు.

సఖి! ఇవియేగాకనింకను నీశక్తిచాతుర్యసామర్థ్యంబుల నిందునిడెందంబునాయందు మరలునట్లొనర్చి, వాసని మనపురోద్యానవనంబునకు దోడ్కొనిరావలయు.

కీర—అమ్మా! పోయివచ్చెద. దిగులుపడవలదు —

(నిష్క్రమింతురు)



# సంగీతశశాంకవిజయము.

## చతుర్థాంకము.

(ఉద్యానవనము)

### 1-వ రంగము.

చంద్రుడు—కీరవాణి—ప్రవేశము.

చంద్రు—ఎవ్వరిదానవు. ఎచ్చోటనుండి యిచ్చటికే తెంచితివి మానవసంచారరహితంబగు నివ్వనంబున కేలవచ్చితివి. ఎచ్చటి కేగుదానవు.—

కీర—చంద్రా! నన్ను నీవెరుంగవా? బృహస్పతులవారియొద్ద విద్యనభ్యసించుకాలమున తారయొద్దనన్ను జూచితివిగాదా. అచిరకాలములో మరపునకువచ్చెనా.

చంద్రు—ఔనౌను చూచియేయుంటిని. నీవచ్చటినుండిచ్చటి కేలవచ్చితివి.

తే॥ గీ॥ ఎంతయోకూర్మి నాపయి ♦ నెంచుతార
కుశలముగ నుండెనో జెప్పు ♦ కోరినన్ను
దలచునే యెప్పుడైనను ♦ కలువకంటి
అచ్చటివార్తలు దాచక ♦ యానతిమ్ము.

కీర — (స్వగతము) నేనెచ్చరించకపూర్వమే తానడుగుచుండె. ఇతడెంతయో కంతుబారికి జిక్కి గాసినొందుచు తారా, తారా, యని పరితపించుచున్నట్లు గన్పట్టెడి నామనస్సంకల్పం బీడేరె. (ప్రకాశముగా) శశాంకా! తారకు నీయందుగల ప్రేమ యింత యని జెప్పుట కలవిగాకున్నది. ఆమెంచెవు లనేకంబులు గన్పట్టెను.—

చ॥ కనులకునిద్రచేకురదు ♦ కంజవిరోధి! నినుఁ వరించియే
పనులను ముట్టదాయె నిను ♦ బాసితొలంగిననాటనుండియుఁ
మనమునకల్వరించునొక ♦ మాటయునాడదు తోడివారితో
నినుగని వేగదోట్కనుచు ♦ నెచ్చెలిరమ్మని దెల్పె నెమ్మితోఁ.

చంద్రా! ఇంకొక్క రహస్యంబుగలదు.—

తే॥ గీ॥ ఊరిచెంగటనున్నట్టి ♦ యుపవనంబు
నందు విహరించ డెందమా ♦ నంద మొందఁ
గాన నచ్చటికీరాత్రి ♦ కేని రమ్మ
టంచు జెప్పంగబంపె నా ♦ చంచలాక్షి.

చంద్రు — ఉద్యానవనమునకు నన్ను రమ్మనెనా! ఆలాగెవచ్చెదవెళ్ళుము.

కీర — నిశ్చయముగావచ్చెదనని బాసచేయుము.

చంద్రు — నిక్కవముగా వచ్చెదను. (బాసచేయును.)

## చతుర్థాంకము.

కీర — వెళ్లుదానను—మరచిపోకుము—సత్వరమునరమ్ము.

[నిష్క్రమింతురు]

[ ఉద్యానవనము ]

### 2-వ రంగము

చంద్రుడు—తార—ప్రవేశము.

చంద్రు—ప్రియసఖీ! కీరవాణిఁ బంపితివి. అంతకుపూర్వమే రావలయునని ప్రయత్నముతో నున్నాడను.

తార—మనోహరా! నీవు యింటినుండి వెడలిపోయినది మొదలు నిద్రాన్నపానాదులుమాని నీవాంఛచే కృశించియున్నదానను. మనమిచ్చటనుండిన మనోరథంబు లీడేరవు. సురగురుండోర్చువాఁడు కాఁడు. గావున నీపురంబునకు నన్నుఁ దోడ్కొని పోవుట యుచితంబు.

చంద్రు—కాంతా! నిన్ను నానగరంబునకు గొనివెళ్ళిన గురుండెంత యాగ్రహంబునొందునో? ఎంతవంత నొందునోగదా—

తార—నీడెందంబున సందియంబు నొందవలదు సత్వరంబున బోవుదము.

చంద్రు—ఎవ్వరైనా చూచుచుండిరా—(అని దిక్కులు చూచుచు వెళ్ళుచుందురు.)

ప్రతిష్ఠానపురంబుచు జేరి) సఖీ! యియ్యదియే మానగరంబు.

ఈసౌధంబునందు సౌఖ్యంబున నుండుదము—

(నిష్క్రమింతురు)

(బృహస్పతి—ప్రవేశము)

3 వ రంగము.

బృహ —[తనలో] నేను స్నానసంధ్యాది కృత్యములు నెరవేర్చుకొని వచ్చునంతలో నింటిలో తారకనుపింపదయ్యె. ఎచ్చటకైనా వెళ్ళియుండెనేమొ. కొంతసేపు చూచెదను [దివ్యదృష్టిని పరికించి] ఔరా! ఎంతమోసము!! ఎంతమోసము!! ఓరిచంద్రా నీకండకావరం బెంత జేసినదిరా—

తే॥ గీ॥ అత్రిమౌనికి గారాబు ♦ పుత్రుడవని
విద్యగరపిన నాకీ ♦ వెలయుననియు
కన్నపుత్రుని భంగినిన్ ♦ గారమొప్ప
సాకినందులకిది మేలు ♦ సల్పితీవు.

బృహ— ఓరిదురాత్మా! కృతఘ్నా! ఎంత దుశ్చేష్టలాచరించితివిరా! తారను నీపురంబునకుఁ దోడ్కొని పోయితివి. ఇఁకముందు పడుపాట్లు నీకే అనుభవమౌను. సురేంద్రునితోఁ జెప్పి నిన్ను శిక్షింపఁజేయుదు—

[నిష్క్రమించును.]

# సంగీత శశాంకవిజయము.

## పంచమాంకము.

[స్థలము—ఇంద్రుని సభాస్థలము]

[ఇంద్రుండు—ప్రవేశము]

### 1 వ రంగము.

ఇంద్రు—దిక్పాలకులారా! మీమీయధికారంబులు నిర్విఘ్నముగా నెరవేరుచుండెనా?

దిక్పా—మహేంద్రా! నెరవేర్చుచుంటిమి.

ఇంద్రు—[దిక్కులుపరికించి] గురువర్యులగు బృహస్పతులవారిటకు దీనవదనముతో నెందులకు వచ్చుచున్నవారలో తెలియదు. [ఎదురుగాజని]

[బృహస్పతి—ప్రవేశము.]

ఇంద్రు—గురువరా! నమస్కారములు. తమరీయాసనంబుపై నధిష్టింపుడు.

బృహ—సుఖీభవ. సుఖీభవ.

దిక్పా—గురువర్యా! సాష్టాంగ వందనములు.

బృహ—"సుఖినోభవన్తున.

ఇంద్రు.—గురువరా!—

తే. గీ॥ దీనవదనుండవై యిట్లు ♦ తీవ్రగతిని
రాగతంబేమి దెల్పుమో ♦ యోగివర్య
మీకునపకృతి సేయను ♦ మేశునైన
శిక్షసేయుదు మీపాద ♦ సాక్షిగాను.

మహాత్మా! మీడెందంబునగల్గుకొందలంబు సందియంబు లేక బయల్పరచుడు. నావాగ్దత్తంబు నెరవేర్చెద. దాచవలదు—

బృహ—ఏమనిదెల్పుదు సురేంద్రా! పరిభులతోఁ జెప్పుకొనుట ప్రజలకు విధాయకమే గాన విశదపరతును.

కం॥ గురుపత్నియని దలంచక
పరసత చంద్రుండునాఁడు ♦ సతియగు తారన్
పరగున గొంపోయియు తన
పురమందిరమున నివాస ♦ ముగనొనరించెన్.

గావున నేనేమిసేయువాఁడను—.

ఇంద్రు—[తనలో] ఏమేమి! చంద్రుడింతటి దుశ్చేష్టలాచరించెను. ఓహో తులువా! స్వర్గాధీశ్వరుని నన్నైనా మాటక యిమ్మహాత్మున కెంతయెగ్గు గావించితివిరా. [ప్రకాశముగా] గురువరా! చింతింపవలదు. నేనాతని వంచించి మీసతినొప్పగించెద. నవ్వాతండేమి సేయనోపు.—

ఉ॥ ఇంతటి ఘోరకృత్యమున ♦ కియ్యకొనెన్ విధుఁ డెంతవాఁడు ర
వ్వంత నెరూపుమా పెదను ♦ వంతదొరంగు గురూత్తమార్య నే
నెంతటి వార్త వింటి నిపు ♦ డేమియొనర్చిన వానిపట్ల నా
వంతయు కిల్బిషంబు మన ♦ వల్లనుగల్గదు వేయు నేటికిన్

[దిక్పాలకులఁ గాంచి] దిక్పాలులారా! మన గురుసతిని దొంగలించుకొనిపోయిన దుర్మార్గుని ప్రాణంబులతో బ్రతుక నిచ్చుట భావ్యంబు గాదు. మనమందర మాచంద్రునిపై మున్ముందుగా దండువెడలి యాతని జయించి గురునకు సతి నియ్య వలయు—

నైరుతి—వాసవా! గోటఁ జీల్చెడు దానికి గొడ్డలితోఁ బనియేల. తొలుదొల్తనే క్రౌర్యభావంబుఁ బూనుట మంచిది కాదు. ఆనిశాచరుం డలతి విక్రముం డని తలంచితివి కాబోలు అతనికి.—

చ॥ కమలజుఁ డిచ్చె గాండివము ♦ గాగల యక్షయ బాణపంక్తులన్
విమలమనస్కుఁడౌచు పృథ్వి ♦ విస్థలిగల్గు నృపాలకోటిచే
సమరమునందు గెల్చి కడు ♦ సత్క్రతులందుచునుండె నాతనిన్
సమయఁగఁ జేయ నెవ్వరిల ♦ జాలరు ముందుగ సంధిమేలగున్.

ఇంద్రు—మీరన్నట్లు దూతనంపించెదము. సామదానభేదంబులవినక నక్కు మిగిలిన దండోపాయంబున సాధింతము. (ప్రక్కకుచూచి) భటా గ్రేసరా!

భటు—రాజా ! సెలవు.

ఇంద్రు—నా యాజ్ఞానుసారంబునసీవు.

చ॥ హిమకరుపాలికేగి కడు ♦ హీనముసౌ పనిజేయవాసవుం
డమరవరుల్ మనంబులను ♦ నాగ్రహవృత్తిజనించి నన్ను మీా
సముఖముజేరి తారనిటు ♦ చయ్యనదెచ్చి సురేంద్రమంత్రికిన్
క్రమమునవిచ్చి మ్రొక్కి తన ♦ కల్మషమెల్లను బాపుకొమ్మనున్.

ఇదినామాటగా జెప్పుము. సంధికొడంబడునట్లు గావింపుము లేదేని తరువాతపని యాలోచించెదము పోయిరమ్ము.—

భటు—తమ యాజ్ఞానుసారంబున బోయివచ్చెద.

[అందరు నిష్క్రమింతురు]

## 2-వ రంగము.

చంద్రుడు—కూర్చొనియుండగా, భటుడు—ప్రవేశము.

భటు—ఓ రాజేంద్రా! నేనింద్రునిమాతను. వారలు మీాతో నీలాగున జెప్పుమనిరి —

తే॥ గీ॥ గురునిసతియగు తారను ♦ గొనసీవు
పురమునందున కాపుర ♦ ముంచితివట
అమరపతితోడగప్పతి ♦ యానతిచ్చి
మిగుల దుఃఖాబిమగ్నుడై ♦ బొగలుచుండ.

ఇంద్రుడు వానికి దుఃఖోపశమనంబు గావించి రోషగంభీర భాషణుండైనన్ను మీావద్దకనిచె గావున.

తే॥ గీ॥ పెక్కుమాటలుబల్కకో ♦ చుక్కలదొర
తారనటు వేగగొనివచ్చి ♦ గారవమున
దేవమంత్రికినియ్య సం ♦ భావనీయు
డాచు దీవించికంపు దీ ♦ ర్ఘాయువుగను.

చంద్రు — బృహస్పతి యాశీర్వచన మటుంచుము. ఇందుౖన కేల కో
పంబు రావలయు. నేనతనితో జయింపలేననియా ?

శా॥ ఏమేమీ ! సురరాజు కోపముననీ ♦ కేమేమొ బోధించియా
భామారత్నము నిమ్మటంచు బలుకన్ ♦ భావ్యంబె తానెంతయో
కామాంధత్వముతో నహల్యవిటులన్ ♦ గాయించగాలేదొ నా
సామార్థ్యంబు నెరుంగ కిట్లుబలుకన్ ♦ శౌర్యంబె అవ్వానికిన్.

తమతప్పు తానెరుంగక పరులతప్పులు బారపెట్టుట
సమంజసమా.

తే॥ గీ॥ ఎంతభయపెట్టినను ముని ♦ కాంత నియ్య
ననుచు దెల్పు మునీంద్రుతో ♦ నందరు విన
వలసివచ్చినపతిసి న ♦ వ్వలకుద్రోయ
పాపహేతువు దుష్కీర్తి ♦ భాజనంబు.

కం॥ తనమీద కూర్మిలేకయు
చనవింతయు లేనిమాని ♦ పతినెటులైనన్
మునుగొనిభోగింపడె తా
ననుమానములేక కోడి ♦ యైన దెరుగరే.

ఏదివిఎక్లైననుగానిమ్ము—నేనెవ్వరిని లక్ష్యపెట్టువాడనుగాను.

తే॥ గీ॥ పాకశాసను డేనియు ♦ పద్మనాభు
డేనియును చంద్రశేఖరు ♦ డైని దిక్ప
తులును మార్కొన్న బోరిగొందు ♦ కలువకంతి
నియ్యడనిదెల్పు ముమ్మాటి ♦ కింద్రుతోడ.

భటు—అయ్యా! చంద్రా! శయ్యముబెంచుకొనుట మంచిదికాదు. సంధికోడంబడుము. నామాటలు వినుము.

చంద్రు—సంధికోడంబడక సమరంబున కోడంబడెనని జెప్పుము.

భటు—నిశాపతీ! మీరిద్దరు సమానబలసంపన్నులరు మీకాహవం బేల. సంధికోడంబడుడు.

చంద్రు—నీసామవాక్యంబులు నాముందు గట్టిపెట్టు. నేనాడినమాట లెల్లనుదాచక యింద్రునితోఁ దెల్పుము.

భటు - మహాత్మా! నాపై నాగ్రహ మొందులరు. అలాగేవెళ్ళి చెప్పె వాడను.

[నిష్క్రమింతురు]

3-వ రంగము.

[ఇంద్రుడు—దిక్పాలకులు, కూర్చొనియుండగా]

భటుడు—ప్రవేశము.

భటు—సురేంద్రా! దిక్పాలులారా! తమ యాజ్ఞానుసారంబున నేనా చంద్రునికడకేగి సంధివచనంబు లనేకంబు వాక్రుచ్చితి. అందుల

కాతఁడు కోపంబున నిటులనె.

తే॥ గీ॥ అమరనాయకునీతి వ ♦ ర్తనములన్ని
యెరుఁగుదును దెల్పపనిలేదు ♦ త్వరితమరుగు
సంధికొడఁబడి గప్పతి ♦ సతినినియ్య
పిరికిపందనెయుని సల్పి ♦ తరుణినిత్తు.

వెన్య్యేల, నాతండు సంధిజేసికొనఁడు. తమపై దోషారోప ణంబులగు వాక్యంబు లనేకంబులుబల్కి గౌతము నింటిపైకి కోడిమై బోవువేళ యీసీతివర్తనంబు తెలుంగఁడు కాబోలు ననుచూ—

తే॥ గీ॥ పరసతియటంచు దెలిసియు ♦ మరువికేళి
గూడక్షమఖవుఁడావేళ ♦ కూడదనుచు
మానవేపరులయెడ నీతి ♦ మార్గములను
చెప్పువానికి నింతటి ♦ చైవులేల.

ఇంకా దుర్భాషణంబు లనేకంబులాడె. సంధి జేసికొనఁడు. రణంబునగాని రమణినియ్యఁడతండు. కాన సమరప్రయత్నంబు గావింపుదము.

ఇంద్రు—నను కోడియనుచుండెగా ! నా చరణాయుధకౌశలంబును రణరంగంబున జూచునుగాక. అతనికోర్కెయే నెరవేర్చెద.—

తే॥ గీ॥ అమరనాయకులారమీ ♦ రతని పౌరు
షంబులగు భాషణంబులు ♦ సాహసంబు

జూనివను నిందగావించు ♦ వాని పలుకు
లన్నివింటిరే సమరస ♦ న్నద్దులగుదు.

ఇంద్రు—దేవదూతా! ఐరావతంబును సత్వరంబున నిటకు దోడ్కొని రమ్ము. దిక్పాలులారా! సర్వసేనాసమేతంబుగా విచ్చేయుడు. ప్రతిష్ఠానపురంబున కేగవలయు—

దిక్పా—అలాగే వచ్చువారము.

[అందరు నిష్క్రమింతురు]

[నారదుడు—ప్రవేశము]

4 వ రంగము॥

నార—[తనలో] ఆహా! నేటికికదా నామనోరథంబీడేరె నేను కలహభోజనుడను సార్థకనాముడను. కలహమున్న నాకన్నోదకంబులతో పనియే లేదు. ఇరువురకు కలహముపెట్టి చూచుట నాకెంతయో సంతోషదాయకము. ఇప్పుడు చంద్రునకు నింద్రాది దేవతలకు సమరంబు జరుగుచున్నది. ఈసమయంబున సురసురాసులకు పోరాటంబు కల్పింపవలయు సత్వరంబున దైత్యగురుడగు శుక్రునికడ కేగి చంద్రునకు దానవులను సహాయ్యంబుగా బంపునట్లు జేసెద.

[శుక్రుడు—నారదుడు—ప్రవేశము]

నార—దైత్యగురువరా వందనములు.
శుక్ర—సుఖీభవ! దేవగురువరా! ఈయాసనంబు నధిష్ఠింపుము.

తార— ఆర్యా! నావిన్నపం బాలకింపుఁడు—

ఆ॥ వె॥ అమరగురునియొద్ద ♦ నఖిలశాస్త్రంబులు
జదువుకొనెడి వేళ ♦ సరసిజారి
మీఁదమోహ మొదలి ♦ మెలత నాతనిఁగూడి
విధుని మందిరమున ♦ విడిదిసేసె.

తే॥ గీ॥ మిగుల వంతను గీష్పతి ♦ పొగలుచుండి
తాను జేసెడిదేమియు ♦ గానలేక
మఘవుకడ కేగి చెప్పిన ♦ మంచిదనుచు
కినుక రెట్టించి సురసంఘ ♦ మనికిదొడరె.

ఇంద్రుఁడెల్ల నిర్జరులను గూర్చుకొని వచ్చి సుధాంశునితోరణం బొనర్చుఁగావున తోయజారికి నీవుతోడై జయం బొనఁగూర్ప వలయు.

శుక్ర— ఏమేమి! ఇంద్రుఁడు చంద్రునితో రణంబుసేయ జూనెనా! గురుండు లజ్జలేక సురేంద్రునితో నేల చెప్పవలయు. నాతండే లకినుక వహింపవలయు కానిమ్ము. నేనా చంద్రునికి సాహాయ్యం బొనర్చెద. నాతండు భయమొందనేల.

చం॥ కనుగొన శిష్యసంతతికి ♦ ఖ్యాతివహించెను కైరవాప్తుడున్
కినుకనుబూని ఇంద్రుడల ♦ కిన్నరులాదిగ దేవసంఘముల్
మునుకొని ముట్టడించినను ♦ ముప్పిక యింతయుఁగల్గనిత్తునే
మునివర నామహాత్యముప్ర ♦ మోదముతో డనుగాంచుమత్తరిన్

శుక్రి—నేనా చంద్రునకు నా శిష్యులగు దైత్యసంఘంబుల సహాయంబు బంపుదు. మీ రేగుడు

[నిష్క్రమింతురు]

[వృషపర్వుడు, శంబరుడు—ప్రవేశము]

5 వ రంగము.

వృష—అమాత్యవరా! దైత్యులకు నిర్జరులకెల్లప్పుడు అన్యోన్యవైరమేకదా. మనకన్ననో దైవబలంబు తక్కువయగుటచే ముప్పు వాటిల్లు చున్నయది.

శంబ—ముప్పునకేమిగాని మన యధికారము నిరంకుశముగా జెల్లుచుండెనుగదా.

వృష—అమరులు మిక్కిలి యుక్తిపరులు.

శంబ—ఏమి యుక్తి పురంబులువదలి వనంబులకేగుటయా.

వృష—వనంబులకేగుట యొకరి సహాయంబపేక్షించి జయంబు గొనుటకు.

శంబ—స్వపరాక్రమంబు లేమిచేగదా పరసహాయంబు గోరుట—

వృష—ఔను! దానికి వారికి శక్తి లేమి యే కారణము. (ప్రక్కకుదిరిగి) అదుగో! మనగురువర్యులిచ్చటకే తెంచుచుండె వారికెదురేగి దోడ్కొని వచ్చెదము—

[నిష్క్రమింతురు]

[శుక్రునితో ఋషపర్వుడు, శంబరుడు—ప్రవేశము]

6 వ రంగము.

శుక్రు—దైత్యేంద్రా! నేనొక కార్యార్థినై నీయొద్దకేతెంచితి.

ఋష—గురువరా! ఎందులకు ఏమిపని.

శుక్రు—నారదుండొక్కయెడ నాతురతతో నాకడకరుదెంచి.

తే॥ గీ॥ అబ్జవైరికి ఇంద్రున ♦ కధికమైన
సంగరము జెల్లుగావున ♦ శక్తికొలది
నీదు శిష్యుల ఋషపర్వ ♦ డాదిగల్గు
వారలను బంపుమిందుని ♦ వాంఛదీర

నారదునిమాట చెల్లించుట మంచిది అదియునుగాక మనవారలకు అమరులకు ఎప్పుడు నెడతెగని పగయేగదా. ఇందుమూలకముననైన పగసాధించుకొనుట కర్తవ్యము.

ఋష—ఇదియేనా! నాకుమాత్రము తెలియదా! వారుగావించిన కపటకృత్యములు తొల్లి.

సీ॥ శంకరుండలతిగా ♦ సంగరనిపుణులౌ
త్రిపురాసురుల బల్మి ♦ ద్రుంపలేదె
పాకశాసనుడంత ♦ ప్రధన విక్రముడైన
వృత్రునాహవమున ♦ మ్రింపలేదె
కృష్ణుండు దర్పపరి ♦ మృష్టులౌనరము రా
సురులనుబరిమార్చి ♦ మురియలేదె

ఖలుఁడు వామనుఁడల ♦ బలిచేత దానంబు
గొని రసాతలమున ♦ కనుపలేదె.

తే॥ గీ॥ నిరపరాధుల దైత్యుల ♦ నిర్జరాళి
మ్రిందజేసిరిగద కడు ♦ మదముచేత
అట్టి తులువల నెల్లర ♦ నాహవమున
పొంకమడగించివచ్చెద ♦ పోలుపుమీర.

మీ యాశీర్వాదబలమున మనపగతులగు సురలను బరి
మార్చి వచ్చెదను.

శుక్రు— మీబోటిశిష్యులుగల నాబోటిగురుని కెట్టి దుర్ఘట కార్యమైనను
కొనసాగకమానునా.

రుష—శంబరా! మనసైన్యంబెల్ల యుద్ధంబున కాయత్తంబు జేయుము.

శంబ—తమ యాజ్ఞానుసారంబున గావించువాడను.

[అందరు నిష్క్రమింతురు]

## 7-వ రంగము.

[చంద్రుఁడు—శుక్రుఁడు—ప్రవేశము.

చంద్రు—[శుక్రున కెదురుగావచ్చి] భార్గవా వందనము.

శుక్రు—జయంబౌగాక. శశాంకా—

తే॥ గీ॥ ఆహవంబింద్రునకు నీకు ♦ జౌనటంచు
నారదుఁడు నాకడకువచ్చి ♦ నళినవైరి

కేని సాహాయ్యమొనరింపు ♦ మాననీయ
యనుచు జెప్పంగవచ్చి త ♦ త్యాదరమున.

చంద్ర — శిష్యులయెడ గురువర్యుల కెంతటి ప్రేమయుండ నంతేవాసులకు శ్రేయస్కరంబౌనుగదా! సమరయత్నంబావర్యుల కేగుదము రండు.

[ఇరువురు నిష్క్రమింతురు]



# సంగీతశశాంకవిజయము.

## షష్ఠాంకము.

### 1-వ రంగము.

ఇంద్రుడు—దిక్పాలకులు—చంద్రుడు—సైన్యము—ప్రవేశము.

ఇంద్రు—శశాంకా!

తే॥ గీ॥ సామవచనంబులనుగురు ♦ సతినినియ్య
మనుచు దూతనుబంపిన ♦ చెనటివోచు
మిగుల దుర్భాషలాడుచు ♦ మిన్నుకన్ను
దెలియకుండుట నిందించి ♦ బలికితివట.

తే॥ గీ॥ సమరమొనరింతువో గెల్వ ♦ జాలననుచు
తారనిత్తువో తెలియక ♦ తప్పటంచు
గురుని బ్రతిమాలుకొనియెదో ♦ కుముదమిత్ర
వేయుమాటలికేటికి ♦ వేగదెల్పు.

చంద్రు—బెదరించినమాత్రమున భయమొందువాడనుకాను. సురగురుం డొక్కరుడేవచ్చి నాసతి నియ్యమన్నచో నేనేమనువాడనో. సతినే యిచ్చువాడనేమో నీవీసురసంఘంబెల్ల వెంటనిడుకొనివచ్చి కయ్యంబునకుఁ గాలుదువ్వ కయ్యంబున కియ్య

గొనక పారిపోవ పిరికివాడనా? సమరాంతమునగా గురుసతిని నిచ్చువాడనుకాను.

ఇంద్రు — గురుద్రోహీ! సమరాంతమున నిచ్చువాడవా? నీమాటలకు బద్ధులమై యుందువారమా. నీరూపుమాపి ఇప్పుడే గురునకు పతినొప్పగించువారము. రణంబున పారిపోక నిలువుము.

చంద్రు — జయాపజయంబులు దైవాధీనంబులు. రూపుమాపుటలు సున్న. కలహమునకుముందు వదరుట మంచిదికాదు.

ఇంద్రు — వదరుటనా యదియా! ఛీ దురాత్మా! దురితభరంబని నెంచక గురుసతిని మోసగించి నీపురమునకు గొనిపోయితివి.

చంద్రు — మాటిమాటికి దురాత్మా గురుద్రోహీయని కూయుచుంటివి? గురుద్రోహి, దురాత్ముడ నేనుకాదు. నీవుగూడా గురుద్రోహివే.

తే. గీ. గౌతముని పత్నిఁ గోరి కున్నె ♦ ఘనతవీడి
కొనుచు కొక్కురోకోయని ♦ కూసికోడి
రూపమెత్తంగ లేదయో ♦ పాపచిత్త
పరులయెడ నీతులనుబల్క ♦ భావ్యమొక్కొ.

తమతప్పు తామెరంగక పరులతప్పులు పారబెట్టు మీవంటి వారి పరాక్రమంబే నెరుగనివాడనుకాను.

క॥ అదలించిబల్కినంతనె
బెదరుచు గురుసతినినియ్య ♦ బేలనె నీవి.

కదనముననిలచి మార్కొను
మదికింపొదగూర్తు • నీదుమద మడగింతున్.

ఇంద్రు—ఓహోరి ! ఎంతప్రగల్భము లాడెదవురా ! నామదమడగించు వాడవు నీవేనా ? ఈ యాగ్నేయాస్త్రంబును గాచుకొమ్ము.

చంద్రు—ఇంద్రా ! నీయాగ్నేయాస్త్రమునకు వారుణాస్త్రం జేయు వాడను.

ఇంద్రు—చంద్రా ! పిన్నతనంపుచైవులని తెల్పినచో, కయ్యంబు మానువాడను.

చంద్రు—నేను పిన్నవాడవగుట నిజమేకాని, నీవు పెద్దవాడవయ్యు నేల దుశ్చేష్ట లొనరించవలె? నాకు బుద్ధిగరపెదవా? కయ్యం బొనర్పుము.

ఇంద్రు—మితిమీరి దుర్భాషలాడుట తగదు. నాగాస్త్రంబు ప్రయోగించితి ధైర్యమూనుము. (అస్త్రము వేయును)

చంద్రు—నిజమాడిన నిష్ఠూరంబు సహజమేగదా? నీయస్త్రంబునకు ప్రతిఘాతంబుగ, గరుడాస్త్రంబును ప్రయోగించితి పారిపోక నిలువుము. (అస్త్రము వేయుచు)

ఇంద్రు—అస్త్రంబునకు ప్రత్యస్త్రం బేయుచుంటివి. ఇప్పుడు వజ్రాయుధంబు ప్రయోగించితి. నీబ్రతుకు తెరగు వెదకుగొనుము. (ప్రయోగించును.)

చంద్రు— తీక్ష్ణనారాచంబులను సమంత్రపూర్వకంబుగ గాండీవంబున ప్రయోగించితి. ఇకనీచేతనైన శౌర్యమును జూపుము. (ఈబాణము అతివేగముగవచ్చి వజ్రాయుధమును విరిమివైచి ఇంద్రుని మూర్ఛితునిగ జేసెను.)

బృహ.—(ఖిన్నవదనుడై) ఓ మృత్యుంజయా! నీవి ట్లూరకుండుట తగునా నా మొరాలకింపవా!

తే॥ గీ॥ సమరమొనరించు ఇంద్రుని ♦ శక్తి గాంచి
చోద్యమొందుచు నిలువంగ ♦ సూరధర్మ
మగునె చంద్రునినోడించి ♦ మగువనిమ్ము
ఆర్తరక్షణపర్వేశ ♦ యఘవినాశ.

[శంకరుడు ప్రత్యక్షమగును.]

శంక — గురువరా భీతిల్లకని లేదు! నేనాతనితో బోరొనర్చి నీనాతిని నీకొసంగెద. సంతోషంబున నుండుము (చంద్రునివైపున కభిముఖుండై) ఓరిచంద్రా! ఎంతవాడవైతివిరా!

చం॥ నిలునిలుమోరి రాత్రిచర ♦ నేటికిగాంచితి నీప్రతాపమున్
కలసురసంఘమంతటికి ♦ గన్యనినింద్రుని గెల్చితీవు ని
శ్చలమతిశౌర్యవంతుడగు ♦ సారసమిత్రుని నోడజేసితో
చలము బలంబు సాహసము ♦ చయ్యన నాకయిజూపు మేపునన్

క॥ గురుభామినియని దలపక
దురితభయంబనుచు మదిని ♦ దోచక గొని నీ

పురముచు కాపురముంచగ
పరువా, నివెరుగవటర ♦ ప్రామథహీనా.

తే॥ గీ॥ నీదు మేనల్లుడిటువలె ♦ నేర్పుజూప
కంటిమంటల కాహుతి ♦ గానొనర్చి
యున్నవాడను దెలియవో ♦ యన్ననీకు
తద్విధంబాను నిలువుము ♦ తడవికేల.

చంద్రు—శంకరా! పెద్దవాడనయ్యును తొలుదొల్తనే పరిగల్భములా
డుచున్నవాడవు. కందర్పుని జయించితినని బల్కితివి. ఏల
జయించినాడవు.

తే॥ గీ॥ ఆర్యపై మోహమగ్గల ♦ మాటగాదె
భవదీనార్ధ దేహార్ధ ♦ భాగమిచ్చి
లొంగియుండుట యెవ్వరె ♦ రుంగరంచు
గొప్ప చెప్పుచునున్నాడ ♦ విప్పుడిచట.

తే॥ గీ॥ గగనమున వాసముండెను ♦ సుగుణమణిని
నిర్మలాత్మను గంగను ♦ నెమ్మితోడ
వలచిదెచ్చి జటాజూట ♦ ములనునిలిపి
యున్నవాడవు నీచైవు ♦ లెన్నదరమె.

నిజదోషంబులుగప్పిబుచ్చి పరదోషంబుల బయటబెట్టెడి మీ
బోటివారల నేమనవచ్చు. భయంపడువాడను కాను. కయ్యం

బున కియ్యకొంటి. ఆగ్నేయాస్త్రంబేసితి. నిలువుము

[అని విడుచును.]

శంక—నీయాగ్నేయాస్త్రంబు నా పాలలోచనంబున నైక్యమొందె నేమి చేయువాడవు

చంద్రు—నాగాస్త్రంబేసితి కాచికొమ్ము

(అని వేయును.)

శంక—నీనాగాస్త్రంబు నా భూషణంబులలో నొక్క భూషణంబయ్యె ఇక నాలోచించుకొనుము.

చంద్రు—వారుణాస్త్రంబు ప్రయోగించితి. తొలగక నిలువుము.

(ప్రయోగించును.)

శంక—భయమొందువాడనుగానని వారుణాస్త్రంబేసితివి. నీయస్త్రంబునాతలనుండు జహ్నువిరిగలసె ఇక నేమిజేసెదవు.

చంద్రు—(విచారముతో నిలుచును.

శంక—నిశాకరా! పాశుపతాస్త్రంబేయువాడను. పారిపోక నిలువుము.

చంద్రు—(గంభీరముగ) మహేశ్వరా! పాశుపతాస్త్రంబేయువాడనని బెదరించినంత మాత్రమున భయమొంది గురుసతినిచ్చి తొలంగువాడనుగాను. ప్రచండగాండీవంబున సమంత్రపూర్వకముగ బ్రహ్మశిరోనామకాస్త్రంబును ప్రయోగించితి. బ్రతుగు తెరగు వెతకుకొనుము.

[అని ప్రయోగించును.]

(శంకరుడు పాశుపతంబును ప్రయోగించును ఈ రెండ
స్త్రములును లోకములను కాల్చివేయుచుండును.)

(దేవతలు — తెరలో కలకలము.)

దేవ, ఋషు — (దేవతలు, ఋషులు బ్రహ్మదగ్గరకు వెళ్ళి పాదములపైబడి) మహాదేవా! బ్రహ్మదేవా! చంద్రశంకరుల శస్త్రాస్త్రంబుల తీక్షణాంబునకు మేమీ సభంబున నిల్వజాలము. త్రిలోకంబులు నిర్మూలంబులగు పునఃసృష్టి గావింపవలసివచ్చును. గావున నిరువురను శాంతచిత్తులనుగావించి మమ్ము రక్షింపుము! రక్షింపుము!

బ్రహ్మ — దేవతలారా! మునీంద్రులారా! భయమునొందకుడు. నే నచ్చటకేగి వారిరువురిరణంబును మాన్పించెద.
(బ్రహ్మ, బృహస్పతి, శంకరుడు, చంద్రుడు — ప్రవేశము)

బ్రహ్మ — మహేశ్వరా!

ఉ॥ తామసమూనగాదగునె ♦ దైత్యవిభంజనయో మహేశ్వరా
తామరసారి పిన్నయయి ♦ తప్పొసరించిన సైపగాదగున్
ఈమహి మీమహత్వమును ♦ నెన్నగశక్యమె మాదు బోంట్లకున్
సామజచర్మచేల కరుణ ♦ శాందమునొందుము చంద్రునందునన్.

తే. గీ. జయమహాదేవ జగదీశ ♦ జయగిరీశ
జయవిరూపాక్ష సురపక్ష ♦ జయసుదీక్ష

జయకలుషభంగ భస్మాంగ ♦ జయకృపాంగ
జయపరాత్పరగౌరీశ ♦ జయమహేశ.
ఓ శంకరా! నాప్రార్థన లంగీకరించి చంద్రునిపై కృపారసంబు వెదజల్లుచు శాంతచిత్తుండవుగమ్ము. నీ పాశుపతాస్త్రంబుపసంహరింపుము.

శంక—పితామహా! అలాగే గావించితి.

బ్రహ్మ—చంద్రా! పిన్నవాడవయ్యు నిమ్మహాసీయునితో నింతచలంబు జూపతగునా. నీయస్త్రం బుపసంహారంబు గావింపుము.

చంద్రు—మీ యాజ్ఞానుసారంబున నస్త్రంబాలాగే గావించితి. (అని పాదములపై బడును.)

బ్రహ్మ—బాలకా! మనంబున వగవకుము. లెమ్ము (అని లేవదీయును.)

చంద్రు—మహేశ్వరా! వందనములు. (కాళ్లపైఁ బడును.)

శంక—శశాంకా! లెమ్ము భయంబు నొందకుము. (లేవదీయును.)

ఉ॥ విక్రమశాలికిన్ రణము ♦ వీరవరేణ్యునితోడనొప్పు నా
శక్రసురావళిన్ గెలిచి ♦ సారసమిత్రునిబోరి దోలితా
చక్రిసురాసురుల్ సమర ♦ సాహసులెల్లను నాదుముందటన్
విక్రమమింతజూపకయు ♦ వేగపలాయనులౌదు రెప్పుడున్.

పరాక్రమవంతుండనగు నాముందునిలచి ధైర్యంబున రణంబొనర్చితివి గాన నీధైర్యస్థైర్యంబులకు మెచ్చితి.

బ్రహ్మ—నిశాపతీ! నీవిక్రమంబునకే నెంతయో సంతోషించితి గావున.—

తే॥ గీ॥ గురుసతిని గురునకిచ్చుట ♦ పరమశుభము
గలుగు గావున నేనింత ♦ గాను జెప్ప.
వచ్చితిని నా దునాజ్ఞను ♦ వలదటంచు
జేయుమనఘాత్మ దురితముల్ ♦ బాయుటకును.

శంక—చంద్రా! విధాతృని యభిమతమే నాయభిమతము. గాన నా సతిని గురున కిచ్చివేయుము.—

చంద్రు—(తారను తీసుకొని గురునివద్దకువచ్చి) గురువరా! తమసతిని తమ కొసంగితి తప్పు క్షమింపుడు. (అని మ్రొక్కును)

బృహ—దురాత్మా! చంద్రా! ఎంతదుష్కార్యమొనర్చితివి. పరసతి కూటమి పాపహేతువని తెలియక, మత్తుడవై గావించినందులకు తేజోవిహీనుండవై అపకీర్తి కాలవాలమై పలుశ్రమ లొందగలవు.

[తారవైపునకుదిరిగి] దుశ్శీలా! కన్నుమిన్నెరుంగక సాక్షి వారిలోనగు బాటూలనిదలంచక, పాపహేతువని పాటింపక, పరపురుషసాంగత్య మొనరించినందులకు పరమాందుమోహవిహీనవై నరకకూపమున కడు కష్టము లొందగలవు.

తార—[తనలో] దైవమా! చంద్రునిపై భ్రాంతికల్పించి మాటలు గొల్పనేల? ఇహపరంబులకు వెలినైయపయశస్సున కాలవాల

నైతి. నిన్ననవేల? నాకండకావరం బింత జేసె. కర్మానుభవం బనుభవించి తీరవలయు. [ప్రకాశముగా] జీవితేశ్వరా! వెళ్లుదము.

[తార, బృహస్పతి నిష్క్రమింతురు.]

బ్రహ్మ— చంద్రా! సత్యలోకంబున కేగివచ్చెద.

శంక—కుముదబాంధవా! సుఖంబున నుందువుగాత- కైలాసంబున కేగివచ్చెద.—

చంద్రు—[తనలో] గురువర్యుని శాప మమోఘము. తప్పదు. అనుభవించితీరవలయు. నాకన్నను సౌందర్యంబున పరాక్రమంబున మిన్నయగువార లెవ్వరులేరని నుప్పొంగుచున్న పొంగు గ్రుంగ జేసెగదా! సాటివారిలో తలవంపులయ్యెనుగదా! అపకీర్తి కాలవాలమైతిని. తేజోవిహీనుండ నైతినిగదా. అన్నియు స్వయం కృతాపరాధమె. బ్రతికి యిన్నియిక్కట్లుబడుటకన్న చచ్చి సౌఖ్య మొందుట మేలు. జ్ఞానాభివృద్ధి గలవాడ నైతి.

భరతవాక్యము

తే॥ గీ॥ పరసతులనెల్ల తల్లుల ♦ భాతిగాంచి
పరపురుషులెల్ల దండ్రుల ♦ భాతిగాంచి
వరలు వనితలు ♦ పురుషు లి ♦ వ్వసుధయందు
చిరతరైశ్వర్య సుఖమోక్ష ♦ సిద్ధిజెంద్రు.

గద్య:—

ఇది శ్రీసీతారామచంద్ర కృపాపాత్ర శనగలవంశ
పవిత్రసుందరరామార్య పున్నమాంబికా సత్పుత్రి
సకలసుకవిజనమిత్రి సహజపాండిత్య గోపాల
కృష్ణకవి ప్రణీతంబైన శశాంకవిజయమను
ద్విమా సర్వంబును

సంపూర్ణము.



# అనుబంధములు.

## అనుబంధము. 1.

ఫీలు—రూపకతాళం.

1 వెంటవత్తు ప్రాణనాధ, జంటబాసియుండజాల।
ఇంటిలోనెనొంటరిగ, నుంటిన మదికేమిదోచదు ॥వెంట॥
2 ప్రొద్దుబోవదేమిచేతు। వద్దనెవరితోభాషింతు।
ఇద్దరమేగుదము క్రతువు। కొద్దకు వేడుకబొడమెను ॥వెంట॥

## అనుబంధము 2

1 వారిజారి నిన్నుగాంచి। నలవునిలుపలేరపొంచి ।
మారుడేయువిరుశరముల। బారికి తాళజాలర।
భావజు కేళిన్ దేల్చర ॥వారి॥
2 మనసుకరగి మాటలాడు। మానమదిమేలవీడు।
ననుబోలినసుందరవతు। లను వెదకిన గాంచవుసుమ।
అనుమానంబది మానుమ ॥వారి॥

## అనుబంధము 3.

1 ఈవనముశృంగారమేరికి। వర్ణనసేయ
వర్ణనసేయ వశమానెగన్గొన। కన్నులకింపైనదీ
కాంతతార మొంతెమొ ॥ఈవ॥
2 నింబంబీర చూతకేత। కదంబవృక్షముల్।
అంబరంబున కంటుచున్నవి పారుజాతముల్ ॥ఈవన॥

## అనుబంధము 4

1 పొదరింటిమాటున । పొలతిడాగెదవేల ।
మదనుడదనుగని । వదలె పూబాణములు ॥పొద॥
2 చెంతనిలచినాతో । సుంత్రైన భాషింపవు ।
పంతమదేల నీపై శాంతి గల్గివచ్చితి ॥పొద॥
సుదతివాకన్న మిన్న । సుందరాకారులతో ।
గదిసి కంతునికేళి । ముదమందజాల వజల ॥పొద॥

## అనుబంధము 5.

1 తార—ఏమనిబల్కెదవుర చంద్రా । సద్గుణసాంద్రా ।
కామించిన వనితనిట్లు । కానిమాటలన తగునె ।
కాముకులమనంబుపైకి । గన్పట్టునుగుట్టుగాను ॥ఏమని॥

2 చంద్ర—ఒంటరిగరాతగవు పోవమ్మ । యుద్యానవనమున ।
ఇంటనుండతగదనినే । నుంటినొంటరిగనిచ్చట
ఇంటనుండుపనులుమాని । తుంటరిమాటలుబల్కకు॥ఒ॥

## అనుబంధము 6,

1 ఇంతటిమోసము జరుగునటంచని । స్వాంతమునను దలచ ।
ఇంతిని చంద్రుని । యింటనునచినే । నింద్రుని
యధ్వరమునకు బోయితిని ॥ఇం॥
2 ఇరుపురిలో ముందెవ్వరికిపనికి । సరి యుండు బాల్పడిక్లో ।

కరువు హీనమని । పరిశీలింపక దురితంబున
కొడిగట్టిరీతులువలు ॥ఇం॥

## అనుబంధము 7.

నాపైకోపమదేల । నాథ నాపైప్రేమ । జూపవలయునేగాని ।
తాపసవరమీద । శాపదావాగ్నికి । నోపగల్గుదునే నే ।
పాపమెఱుగ నైతి ॥నాపై॥

## అనుబంధము 8.

1 రమణిపోరావె పోవుదమీవేళ । జాగు, బాగు, గాదు చేయగ
సమయమును వీక్షించివచ్చితి।సత్వరము ప్రతిష్ఠానపురికి ॥రమ॥
2 గురువరేణ్యులిచ్చుటకు రాకమునుపే। వార, జేరు, దురు,
ఋణముకు । సురగురుండిటకరుదెంచిన । జరుగనేరదు
మన ప్రయత్నము ॥ రమ॥

## అనుబంధము 9.

1 ఏమనిదెల్పుదు వాసవానీతో ।
ఏమిచేయుదు నాకేమియుదోచదు ॥ఏమని॥
2 వద్దికతోనా । యొద్దచదువుకొని ।
పొద్దు మీరించుమరి । డాచరించిన చైవు ॥ ఏమని॥

## అనుబంధము 10

ఎంతసుగుణశాలి । ఇంద్రుడెంత ధైర్యశాలి।
వ[illegible]దు దేవగురున । కెంతయో ధైర్యంబుజెప్పెనట॥ఎం

2 భూషించెదనన్ను । శ్రీగుణభాషణాబులాడెమున్ను ।
భూషించిరటంచు దలచి । పొంగుచున్నెమరచెనేమొ ॥ఎంత

## అనుబంధము 11.

1 బాలగోపబాలవాపై । జాలిలేద యింతో వేడెద ।
మేలువాడవనుచుమదిని । చాలనమ్మితి ।
వాలగు కన్నులజూడవు । వాలినిగూల్చిన ప్రౌఢవు ।
నీలశరీరుడవీవు । నిగమాధారుడవీవు ॥బాల॥

2 కరిమొరవిని సత్వరమున । చరుగుదెంచి మకరిదునిమి ।
కరిరాజును ధన్యుజేసి గాచినవాడ॥
పరిపరివిధములవేడితి । పరదైవంబులవీడితి ।
కరుణకుపాత్రుడనైతి । మురహారనీవే సద్గతి ॥బాల॥

## అనుబంధము 12.

### మంగళహారతి

1. నీరజనాభగైకొను । నివాళియొసగెదము ॥నీర॥
2. సనకసనందనాది । సన్మౌనిబృందవందిత ॥నీర॥
3. సంగధీర గరుడతు । రంగాశివధరుర్భంగ ॥నీర॥

మంగళంమహాత్.

---

శ్రీ సత్యనారాయణ ప్రెస్, రాజమండ్రి